# స్టేషను పంపు

[ కథలు ]



చలం



బిజలీ పబ్లికేషన్స్,
విజయవాడ.

# స్టేషను పంపు

ఆమెని మొదట రైలుస్టేషన్ నీళ్ళపంపుదగ్గిర చూశాడు సూర్యారావు. అతనికి ఆవూరు గూడ్సుస్టేషన్‌కి బదిలీ ఐ, ఆమెను చూసీ, తనకి టిక్కెట్లుఇచ్చే గుమాస్తాపని అయివుండ కూడదా అనిపించింది. ఆమె తక్కిన ఆడవాళ్ళతో రాదు నీళ్ళకి. వాళ్ల తగూలతో కలవడం ఇష్టంలేకనేమో? అందుకనే అతను గుడ్సుషెడ్డు తాళంవేసి ఆలస్యంగా సాయింత్రం ఇంటికిపోయేప్పుడు వొంటరిగా కనబడ్డది ఆమె. బిందినిండి నీళ్ళు కిందికి గంతు లేస్తున్నాయి; తూర్పున పచ్చగా మెరుస్తున్న మబ్బులోంచి తళ తళమంటున్నాయి కిందికి దొర్లుతూ. నడినెత్తి ఫాల్గుణమాసపు చంద్రవంక వంక చూస్తోందేమో ఆమె గంగరావిచెట్టు ఆకుల మధ్యనించి, ఆ ఇనపకడ్డీమీద చేతినానించి, గడ్డం చెయ్యిమీద మోపి, కళ్ళని పైకెత్తి, నిర్జనమైన ప్లాట్‌ఫారంమీద. దూరంగానే నిలబడి చూశాడు, తొరగా నడుస్తున్నవాడల్లా చప్పున ఆగి. ఆమె రెండు నిముషాలైనా కదల్లేదు. లేదు. ఆమె ఏమీ చూట్టంలేదు. ఆకాశంలోనూ లేదు, భూమిమీదా లేదు, ఆ మనసు. గతంలోంచి ఏ ఫిల్ముని తిప్పుకుంటోంది—మనోనేత్రంముందు. అతను తనతోవని మార్చి ఆమెవేపుగా దగ్గిరదాకా వొచ్చిందాకా ఆమె అతనివేపు చూడనేలేదు.

"నీళ్లు పోతున్నాయి."

తన కంఠంలోంచే వొచ్చింది ఆ శబ్దం.

నిదానంగా అతనివంక చూసింది. కాని అతను ఇంకా ఆమె మనోకాశంలోకి వెళ్ళినట్టు లేడు. చెవుడా? మూగా? కాని ఆ పెదవులు, కళ్లు! ఆమె కనపడకపోతే మళ్ళీ, తన నిత్యజీవితంలో పెద్ద లోపం ఏర్పడుతుంది. చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. నిద్రపోయే కుక్కా, పట్టాలలో వెతికే మేకా, పైన యింకా కళ్లు బాగా కనపడని చంద్రవంకా మూగసాక్షులు.

"బిందె ఎత్తనా?" అన్నాడు దగ్గిరికి వెళ్ళి.

సంధ్య కాంతిలో అంత మెత్తగా నున్నగా....ఆ మెత్తదనం వుత్తమోసం—ఆ చేతులు ఎత్తుబుజాలు—ఆ పమిట దృఢత్వం ....శాంతపరుస్తో కళ్ళని—ఆమె నడుంతీరు నుదిటిమీది బరువుజుట్టు వొంపు. నుదిటి నలుపుమెరుపు మీద జుట్టు నలుపుమెరుపు - లోకపు చీకటిపైన ఆకాశం చీకటి - దాంటో ఎత్తుపల్లాలలో తళంకుల నొక్కులు - సంధ్యకాంతి దాక్కుంటోంది జుట్టులో రాత్రికి జడిసి. ఎర్రచీర, జడపైని ఒక్క చక్కని గంగరావిపువ్వు.

చూసింది అప్పుడు నిదానంగా, చిరునవ్వు తనమీద - ఓ నిమిషపు సంబంధం.

"ఎత్తుకోగలను, తీసుకువెళ్లలేను"

"రోజూ తీసుకెళ్లవా?"

"రోజూ ఇంతే!"

"జబ్బా!"

"ఊ"

కంఠంలోంచి పెదవుల చివరికి నవ్వు హాస్యంచేస్తోంది తనని.

"ఏం జబ్బు?"

"ఇక్కణ్ణించి పోలేకపోవడం"

"ఏమి?"

నవ్వుతో అతనివంక చూస్తోంది.

"ఏం లేదు వెళ్ళడానికి .... బావుందికదూ ఇక్కడ?"

"ఊఁ"

"మీరు వెళ్ళాలిగావును?"

ఛాలెంజి.

"అక్కర్లేదు"

"అయితే రండి. కూచోండి."

ఆ పళ్ళెం గట్టువంక చూసింది.

అడుగు వెనక్కి వేశాడు.

పకపక నవ్వి బిందెని సునాయాసంగా ఎత్తుకుని చక్కా వెళ్ళిపోతోంది.

"మరి వెడుతున్నావేం?"

"వెళ్ళకపోతే వూరుకుంటారు?"

"ఎవరు?"

"మీరు."

"నేనా?"

"ఈ స్టేషను మీదేగా!" అని వెడుతోంది.

"ఈవాలిటికి వెళ్లండి. ఎవరన్నా కోప్పడతారేమో? ధైర్యమాలోచించుకుని రేపు మళ్ళీ రండి, కూచోవాలనివుంటే"

వెళ్ళిపోయింది దూరంగా. బిందె బరువుతో వొంగిన ఎడంభుజంతో బిందె అంచువొంపులో వెన్నెల మొదటిరేఖ.

అట్లానే నుంచున్నాడు ఆమె పోర్టర్ల ఇళ్ళవెనక మలుపుతిరి గిందాకా.

మర్నాడు సాయంత్రం ఐదింటినించే అతని దృష్టి గుడ్సు షెడ్డు తలుపులోంచి పట్టాలూ, ప్లాట్‌ఫారం దాటి నీళ్ళపంపువేపు. రిజిష్టరులో చివరికూడికలు తప్పిపోయి మరీ ఆలిశ్యమౌతోంది. చంద్రవంక ఇంకొంచెం తూర్పుకి వొంగి నిన్నటి పరిచయాన్ని జ్ఞాపకంచేసింది. తోళ్ళవాసనని నెట్టి గాలివీస్తోంది దక్షిణంనుంచి వసంత రహస్యాల్ని రక్తానికి పలుకుతో. తీరా తలుపుమూసే సమయానికి ఆ స్టేషన్‌తో ఏమాత్రం పనిలేని కాళీపెట్టెల గుడ్సు బండి నీళ్ళకోసం దీర్ఘంగా ఆగింది గంగరావిచెట్టు చివరకూడా తనకళ్ళ బడకండా.

తనగది ఎత్తునుంచి గులకరాళ్ళమీదకి పట్టాలదగ్గిరికి జారి, రాక్షసిబొగ్గుల్ని తప్పించుకుంటో ఆ బోలుపెట్టెల గోడ నీడలో నడుస్తున్నాడు చాలా గొప్పముహూర్తాలు మించిపోతున్నట్లు ఇన్ని డబ్బాలు ఎక్కడ దొరికాయో తగిలించుకోడానికి ఆ రైలుకి! ఆ పెట్టెల సందుల్లోంచి వుత్త ప్లాట్‌ఫారం ముక్క దానివెనక నాలుగు ఇనపకమ్ములూ, కనపడతాయి. అన్నిసందుల్లోంచీ అంతే, అమ్మా! నీళ్ళపంపు, దానికింద అదే ఇత్తడి బిందే, దానిమీద తెల్లని వెన్నెల మెరుపుచార, కారిపోయే నీళ్ళలో. కాని ఆ బిందెకి అర్థంలేదు. విప్పేసిన రవికమల్లే వుత్త అర్థంలేని బిందె పక్కన పైన వుత్త గంగరావిచెట్టు. ఇంక ఎన్ని సందుల్లోంచి చూసినా ఏమీలేదు. వుత్త కటకటాలు.

గార్డుపెట్టె. ఎన్నిమైళ్ళ దూరం నడిచాడో తనమనసులో తాను. ఒక్కొక్క కొయ్య బద్దీ ఒకదాటలేని అడ్డం. అబ్బో చాలా

మారం వొచ్చాడు ప్లాటుఫారం దాటి. నాలుగు గజాలు మను షుల కొలతప్రకారం. ఎదురుగా గార్డుపెట్టె, గుమ్మంలో గార్డు. తెల్లటి సూటు, మెరిసే బూడ్సులు. అతనిముందు పెట్టె గుమ్మం లోకి కాలు ఎత్తిపెట్టి, వొయ్యారంగా ఆమె, ఆ గార్డుతో నవ్వుతో. తను వెళ్ళిపోయి ఏంచెయ్యడం? వెడుతున్నాయి కాళ్లు. గార్డు చూశాడు అతన్ని. ఏదో అంటున్నాడు. కాని తను ఆగ కూడదు అనుకుంటూనే.

"హల్లో! ఛార్లెస్!" అన్నాడు.

"హల్లో! సూర్యారావు? ఇక్కడికిమార్చారా ఏమిటి నిన్ను! బావుందా?"

"చాలాబావుంది." అని ఆమె. ఎందుకు తనతో ఆ హాస్యం!

"ఏం బావుంది?"

"సంపాదన," అని ఆమె

"ఏం సంపాదన?"

"వెన్నెల సంపాదన"

"వెడతానోయ్," అని తాను, ముందుకి ఓ అడుగు. వీపు వెనక పెద్దనవ్వు. కోపంతో వెనక్కి తిప్పాడు మెడ.

"నీళ్ళు కారిపోతున్నాయి," అని ఆమె.

"కారిపోతే"........"

"వెళ్ళి పంపుతిప్పేయండి. కంపెనీనీళ్ళు" అని ఆమె.

"తిప్పుకో"

"నేను మాట్లాడుతున్నాను, కనపట్టంలేదా?"

ఛార్లెస్ బిగ్గిరిగా నవ్వుతున్నాడు.

"రావోయ్, వెళ్ళకు"

"నే నెందుకోయ్ మధ్య."

వెళ్ళిపోయినాడు చిరచిర, మళ్ళీ ఆ పెట్టెల్ని రెండో వేపునించి ప్రదక్షిణం చేసుకుంటో. సందుల్లోంచి అటువేపు చూడ్డానికి ఇప్పుడు ఏమీలేదు. కంకరని చూపుతో కాలుస్తో తొర తొరగా గేటులోంచి తన ఇంటోకి, వొంటరిగా బావురుమనే రైలువాళ్ల పిసినికొట్టు గదిలోకి. కాని నిన్నటికంటె ఎంత చీకటి ఇవాళ! ముందువాకిట్లో టీకి కొంచెం నీళ్ళు పెట్టుకున్నాడు కుం పటిమీద. కప్పు గొల్లభామ పాలడబ్బా పెడుతున్నప్పుడు రైలు కూతకూసింది. ఇంక వెడితే స్టేషన్‌పంపుదగ్గిరికి. ఛీ! సిగ్గయినా లేదు తన మనసుకి! ఎందుకో కోపం అతనికి తెలుసా?

దొడ్లో గబగబ డబ్బాతో బోర్లించుకుంటున్నాడు కాలే వొంటిమీద చన్నీళ్లు. తుడుచుకుంటో వొచ్చాడు మరిగే నీళ్లపని పట్టించడానికి. కుంపటిమీదనీళ్లగిన్నె కిందపడిపోయింది. కప్పు ఏదీ? కుర్చీమీదికి ఎట్లా వెళ్ళింది? కప్పునిండా టీ. ఎవరు? వీధి గుమ్మంలోకి ఓఅంగ. బెదిరిచూసే బిళ్ళగన్నేరుపువ్వు పక్కన నీళ్ళ బిందె. బిందె మూతిలో ఇరుక్కుని కూడా బిగ్గిరిగా నవ్వుతో చాపలాగా తేలే చందమామ. బిందెని మోసిన బుజా లేవీ? వొస్తుందిలే. లోపలికి వొచ్చి వేడిటీని ముద్దుపెట్టుకున్నాడు.

"బావుందా?"

అక్కడేవుంది మాలతి పొదవెనక. ఎవరునాటారో ఆ తీగెని! ఈనాటికి ఆమెని దాచింది. ఏంమాట్లాడదామన్నా తోచ లేదు. కప్పుతోటే అటు నడిచాడు. ఆ తీగెచుట్టూ తిరిగి ఇటు వొచ్చింది ఆమె. సరిగా సినిమాలోమల్లే తిరుగుతున్నారు. పాట లేదు. అంతే భేదం.

చప్పున ఎదురు తిరిగింది.

నవ్వుతో అతని బుజాలమీద చేతులేసి వేడిమూతిమీద ముద్దుపెట్టుకుంది.

"ఛీ, చార్లెస్ ఎంగిలి."

అవును అదీ సంగతి. అతనిబాధ శబ్దరూపంలో వొస్తేనే గాని అతనికి అర్థంకాలేదు. అవును వొంటరిగా....ఆ రెండోకాలు కూడా ఆ పెట్టెలోకి ఎత్తి....సాయింత్రపు చీకట్లమూల-అతని సీటు వెనకాల-వుత్త ముద్దులేనా?

"ఆ ఎంగిలేదో ఇదివరకే అయింది. టీని రుచిచూడ కుండానే పెట్టానా ఆ కుర్చీమీద?"

టీకప్పుని అమాంతం కిందవేసి కొట్టాడు. ఆమె తెల్లచీరె పసుప్పచ్చ అంచుమీద చింది ఇంకిపోయింది, టీ.

"అయిందా? ఇంకా వుందా కోపం?"

నవ్వుతో తన భుజంచుట్టూ చెయ్యివేసింది.

"పో, సిగ్గులేనిదానా!"

అని తోసేశాడు, నవీనప్రవరాఖ్యుడు.

"అబ్బా!" అంది వరూధినిమల్లేనే!

పింగాణీ పెంకు కాలుకింద ఎర్రనయింది. దుమ్ములోకి వొరిగింది, పాపం. పడకుండా పట్టుకున్నాడు, నడుంచుట్టూ చేతులేసి.

ఆమె అతని మెడపట్టుకు వేళ్ళాడింది.

పెట్లోకి మోసుకెళ్లాడు.

"వాకిలితలుపు వేసిరండి."

"బిండె"

"ఔను లోపల పెట్టండి."

బిందెనీ, చందమామనీ లోపల పెట్టి తలుపు గడియవేసి నిమిషంలో వొచ్చి, కాలుకడిగి, తుడిచి, కట్టు కట్టాడు. ఆమె నవ్వు వింటే తన ఆదుర్దాకి సిగ్గు.

"ఇంక రా"

"ఎట్లారాను? కాలు తెగిపోయిందిగా?"

"అంతమాత్రానికేనా?

"అంతమాత్రానికే ఇంతకట్టు! కాలుమీదనే వొలికి పోయిందా మీ దయ కాస్తా?"

"లేదు. ఏంచెయ్యాను చెప్పు."

"నన్ను లేవతీసి తీసుకువెళ్ళండి."

చంకలకింద చేతులు కలిపి లేవతీశాడు ఆమెని. తన బరువునంతా, నడుంపైన అతనిమీద జేరవేసి నడిచింది రెండడుగులు. బాధతోనిండిన ఆమెకళ్ళని మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు. వాకిటివేపు నడిచారు, బైట వెన్నెలకాంతి నీడతో నిండిన ఆ చీకటి గదిలోంచి.

"ఇంటిదాకా నడవగలవా?"

"నన్నిట్లా తీసుకుపోగలరా?"

"ఆ"

"ధైర్యమే!"

వెక్కిరిస్తోంది. అతని చిన్న క్యాంపుకాట్ దగ్గరిగా వెడుతున్నారు. "అమ్మో!" అని బాధతో అరిచి దానిమీద పడిపోయింది ఆమె, అతని మెడని ఉరివలె కావిలించుకున్న చేతులతో.

అతన్ని తనవెంట లాక్కుంటో గోడవేపు తిరిగి దిండులో తల దూర్చుకుంది.

"ఏమిటి? ఏమిటి? ఏమయింది?"

ఆమె నిలువునా వొణికిపోతోంది. కన్వల్షన్స్! ఏం చెయ్యాలి? లేవబోతున్నాడు. కాని ఆమె చెయ్యి అతని మెడ చుట్టూ వేసిన ఉచ్చునుమాత్రం వదలనే లేదు.

"ఏమిటి? ఏమిటి? నా ప్రాణం! ఏమిటి?"

ఇంకా దగ్గిరికి లాక్కుంది ఆమె చెయ్యి, తన పక్కనించి అతని ముఖాన్ని తన రొమ్ముకేపు. నవ్వుతోంది.

"నువ్వా! ఎంతటక్కరివి!"

*  *  *  *

చంద్రుడు చుట్టు తిరిగి ముందువాకిలినంతా నీడపడేశాడు, వాళ్ళు వొచ్చి బైట నుంచునేప్పటికి.

"వెడతాను."

"వుండు, వొక్కనిమిషం కూచో."

ఆమె గుమ్మం మీద కూచుంది. అతను ఆమెపాదాల దగ్గిర కూచున్నాడు. దూరంగా బిందె ఏమీ ఎరగనట్టు చంద్రుడు కనపడని ఆకాశంవంక చూస్తోంది. చాలాసేపు అతను మాట్లాడ లేదు. నిజమా అన్నట్టు ఆమె చేతులూ, తొడలూ, మెడా తాకి చూసుకుంటున్నాడు.

"ఇంక వెళ్ళనీ"

"చూడు, నేనేం చెప్పలేకపోతున్నాను. ఏం చెప్పినా నీకు అర్థమౌతుందో లేదో. నాకు నువ్వు—"

ఆగాడు.

"మాట్లాడకు. నాకు తెలుసు."

"ఎట్లా?"

"ఎట్లానైతేనేం? తెలుసు కాని, నేను చెప్పేది విను."

"చెప్పనక్కర్లేదు. వినను."

"వినాలి. తప్పదు."

"ఏమీ వినను. పద."

"వినాలి. చాలా ముఖ్యం. ఇంతే. రేపు పొద్దున్ననుంచి నన్ను నువ్వు ఎరగవు. నిన్ను నే నెరగను" అంది ఆమె.

"అదేమిటి?"

"ఏమీ అడక్కు; అంతే."

"నిజమా?"

"నిజమే."

"ఎందుకట్లా?"

"అంతేగనక."

"నే నేమైనా...."

"ఏంలేదు నువ్వు...."

గుమ్మంనించి జారి అతన్ని రొమ్ముమీద తలపెట్టి కావిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

"అంతేలే" అంది చప్పున. మబ్బులేని ఆ వాన నిమిషంలో మాయమయింది.

"నాప్రాణం ఇస్తాను నీకు. అదే నేను చెప్పాలనుకుంది" అన్నాడు.

"నీ పాదాలుపట్టి నిన్ను వేడుకుంటాను, నన్ను మరిచిపో."

"ఇంక కనపడవా?"

"కనపడక ఏమౌతాను?"

"ఐతే నేనూరుకోను."

"వూరుకునితీరాలి."

"చూస్తాను కదూ! నిన్ను ఇప్పణ్ణించీ వెళ్ళనీను."

అని నుంచున్న ఆమెని కౌవిలించుకున్నాడు. ఆమె గట్టిగా కౌవిలించుకుంది. కళ్ళు తెరిచేప్పటికి ఆమె లేదు. బిందె మాత్రం వుండిపోయింది ఆ వింత సంఘటనకి సాక్షిగా.

అట్లా వాకిట్లో కూచుని ఆలోచిస్తో ఎప్పుడు నిద్రపోయి నాడో సూర్యారావు, కళ్ళు తెరిచేప్పటికి చాలా పొద్దెక్కింది. బిందె లేదు. రాత్రి తలుపు గడియవెయ్యడంకూడా మరిచిపోయి నాడు గావును.

మర్నాడు సాయంత్రం నున్నని ఇనప కడ్డీల్ని వెండికించ మార్చే సాయంత్రం, వెన్నెలలో పంపు దగ్గిరికి నడిచాడు. నీళ్ళు పట్టుకుని అప్పటికే వెళ్ళిపోతోంది అమె. కొంచెం ధైర్యంచేసి అటే నడిచాడు తనుకూడా. అతనికి నమ్మకం రావటంలేదు నిజంగా ఆమె మాట్లాడదని. బిందెబరువుతో జాచుకున్న నడుముని చూస్తో మళ్ళీ ఆ నడుముకింద నించి చేతులు పోనిచ్చి తన దగ్గిరికి వరసగా లాక్కోకుండా ఎట్లా బతికగలడు? అనేదే ప్రశ్న.

"న న్నెరగరని చెప్పలేమూ? వెళ్లండి, వెళ్ళండి. ఇంక రాకండి."

"ను వ్వెవరో నీ భయ మేమిటో చెప్పాలి."

"నేనేం చెప్పను. నేను రాను. మీరు వెళ్ళిపొండి. చెపు తోంచే మనిషి కామా?"

"ఎవర్నన్నా అడుగుతాను నీసంగతి."

"కానీండి. ఎవరన్నా చెపుతారు. ఇంక పోండి. నావెంట రావొద్దు."

"వీల్లేదు. నీ యింటిదాకా వొస్తాను."

"నా ఇంటికా! దేవుడా! ఇదేం పోరు! పో. నా మొగుడూ, నా సంసారం, పిల్లలూ....ఇదేం గొడవ తెచ్చిపెట్టుకున్నాను?"

"నేను వెళ్ళను."

ఆగింది ఆమె.

"నేను అరుస్తాను; వెళ్లు." అని భయంతోచుట్టూచూసింది.

వాళ్లు ఈతచెట్లవెనకగా వున్నారు. వాటిని దాటారంటే పూరిఇళ్లు కనపడతాయి.

"నేను వెళ్లను." అని బుజం పట్టుకున్నాడు.

"రా నాతో రా ఇప్పుడు" అన్నాడు

ఆమె చప్పున బూతులు ప్రారంభించింది, మొగాడికి ములుకులమల్లె గుచ్చుకునేవి. నివ్వెరపోయి చూశాడు అతను. తిడుతోంది, వుమ్మేసింది.

"ఇంక ఒక్క అడుగు కదిలావా అందరి ముందు నీ మొహాన ఉమ్మేస్తాను. పో."

అని చప్పున చిర చిరా వెళ్ళిపోయింది.

ఏమి అర్థంకాక, తన చెవుల్ని నమ్మలేక, అసహ్యపడి మళ్ళీ అసహ్యాన్ని నిలుపుకోలేక, ఇంటికి వెళ్లాడు. నిండారు వెన్నెల. రక్తాన్ని పిలిచి పలికించే దక్షిణపుగాలి. ఎటు చూసినా ఆమె అందం. ఆరాత్రి—ఆమె తనని ఎంతకాంక్షతో తీసుకుంది? స్త్రీ ఆవిధంగా కోరి సంతోషించడం పుస్తకాల్లోకూడా చదవలేదు అతను. అసలు వుంటుందని అనుకోలేదు. ఏం చెయ్యాలి? ఆమె

తన రక్తంలోకి ఎక్కింది. వొదలదు. చీకటిపడ్డాక ఎత్తుకువొస్తే బలవంతంగా! ఆమె ఇల్లు తెలుసుకుని వెడితే! ఆమె తిట్టిన పాడు తిట్లు సులభంగా మర్చిపోయినాడు. మర్చిపోకపోతే ఏ పురుషుడు ఏ స్త్రీతో కాపరం చెయ్యగలడు?

మర్నాడు సాయంత్రం దూరంగా పంపుదగ్గర ఆమెని చూపించి పోర్టర్ని అడిగాడు ఆమె ఎవరని.

"అదా తప్పుడుముండ." అని ఇంకా రెండు తిట్టాడు.

"ఆమె ఎవరు చెప్పు?"

"నామాట వినండి. శుభ్రంగా పెళ్ళిచేసుకుని ఓ అమ్మ గార్ని తీసుకురండి. ఈ పాడుముండలజోలికి పోయి చెడి పోకండి" అన్నాడు.

ఎవర్ని పలకరించినా నీతిబోధ చేసేవారేకద.

కాని ఆ పంపుదగ్గిర నీళ్లు పట్టుకుంటో వొయ్యారంగా, కళ్ళు పైకెత్తి, ఎవరిలక్ష్యమూ లేకుండా ఆకాశం నీలాన్ని గమనించే ఆమెలో దోషం అతని హృదయం నమ్మనంది. ఆరాత్రి ఆమె రొమ్ము–ఆమె మాట–ఆమెతీరు తనమీది దయ–ఆమె? ఈ మాటలు వీడు?

రెండురోజుల్లో మళ్లీ ఛార్లెసు గుడ్సురైలు వొచ్చింది. తను చూసేప్పటికే రైలు కదలబోతోంది. చివరి నిమిషంలో నవ్వుతో అతని పెట్టెలోంచి దూకింది ఆమె. రైలు వెడుతో గార్డు పెట్టి దగ్గిరికి రాగానే ఛార్లెస్ సూర్యారావుతో

"ఆ అమ్మాయి సంగతి వొదిలెయ్యి బ్రదర్. అటు పోకు" అన్నాడు.

"వీడి సొమ్ముగావును ఆ అమ్మాయి! దొంగవెధవ. నీతి చెపుతున్నాడు" అనుకున్నాడు. వీడుకూడా నీలిబోధలేనా?

ఇంట్లోకి వెళ్లాడు. టీమీద బుద్ధిలేదు. ఇంకా చంద్రుడు ఉదయించలేదు. అగ్గిపెట్టెకోసం కోటుజేబుదగ్గిరికి వెళ్లాడు. వెనకనించి చీకట్లోంచి కావిలించుకుంది ఆమె.

"నీ దిగులుని భరించలేక వొచ్చాను. పదినిమిషాలు రా....కోపమే! తిట్టాననా? తిడితేగాని పోవుకదా! ఏంచెయ్యను?" అంది దిగులుగా! లాగుతోంది బుజాలు పట్టుకుని.

"పో, నన్ను ముట్టుకోకు." అని పెద్ద బూతువిసిరాడు, ఆమెని తోసేశాడు. ఆమె కదలక నుంచుంది. ఏడుస్తోందా? అతనికోపాన్ని తుడుస్తున్నట్టు దగ్గిరికి వొచ్చి చంపలమీద చేతులు వేసి,

"నీదాన్ని కాదూ! నీకోసమే. నీకోసమే, నమ్ము. రా రా. దగ్గిరికి రా. వెళ్ళిపోవాలి. రా"

ఎట్లా తప్పించుకుంటాడు ఆ కౌగిలిలోంచి? ఏమైనా అట్లాంటి కౌగిలి జన్మలో ఎప్పుడో ఏ అదృష్టంవల్లనోగాని లభ్యంకాదని తెలుసు అత కి. పసివాయిడు కాదు.

మాట్లాడకుండా దగ్గిరికి తీసుకున్నాడు ఆమెని. ఆమె ఎంత తొందరపెట్టా వెళ్ళడం పదినిమిషాలల్లా అరగంట దాటింది, మంచి యవ్వనంలో ఒకరికొకరు ఎదురుపలికే రక్తాలతో. కాలం అనేది కొలత లేదు వాళ్లకి.

తలుపు తెరిచి ఇటూ అటూ చూసి చల్లగా జారిపోయింది ఆమె చీకట్లోకి. ఆమె వెళ్లిన దిక్కుకే చూస్తో నుంచున్నాడు. హోటలుకి వెళ్ళాలి, కాని ఇప్పుడేం తొందర? గడిచిన అరగంట

అద్భుతాన్ని నిదానంగా తీరికగా నెమరువేస్తో, అట్లానే వుండి పోయినాడు.

అతని వీపువెనక పిల్లిమల్లే దగ్గిరికి జరుగుతున్న ఆకారాన్ని గమనించాడా? మెల్లిగా చెయ్యి ఎత్తి అతని మెడచుట్టూ చెయ్యేసి,

"ఈసారి దానికేసి కన్నెత్తావా—చచ్చావే"

అనడం, అతని నెత్తిమీద గట్టిగా కొట్టడం ఒక్కసారే జరిగాయి ఆ సూర్యారావు వేసిన కేకకూడా బిగ్గిరిగారాలేదు. ఆ ఆకారం అట్లానే చీకట్లోకిపోయింది.

అతని చిన్నకేకకే చుట్టుపక్కవాళ్ళు వొచ్చినట్టున్నారు. తెల్లారి కళ్లు తెరిచేప్పటికి ఆస్పత్రిలో వున్నాడు.

పాపం, ఆమె ఇందుకుగాను తనని అంత భయపడి జాగ్రత్తపరిచింది.

సూర్యారావు రైల్వేలో చేరాడన్నమాటేగాని, అతను చాలా పాప్యులర్. అతని మిత్రబృందంలో కాలేజిలో చదివిన ఏణ్ణర్థంలో గొప్ప ఫుట్‌బాల్ ఆటగాడు అతని ఆటమిత్రులు రౌడీలూ, వొస్తాదులూ అతనికి ప్రాణమిస్తారు. ఆరోజే ఒకతనికి ఉత్తరం రాశాడు మూడో రోజుకి ముగ్గురు దిగారు. వాళ్ళతో ఏమీ చెప్పలేదుగాని, తనకి నయమయిందాకా వుండమన్నాడు. అంతకన్న వాళ్ళు చేసేపని వాళ్లకేం లేదు గనక వుండిపోయినారు. పైగా సూర్యారావుమీద చాలా ప్రేమ వాళ్ళకి. అతన్ని ఎవరో కొట్టారని తెలుస్తోనేవుంది. వాళ్ళు మర్యాదస్తులుకారు. తియ్యని కబుర్లు చెప్పి, ఏదో చెడ్డ వ్యవహారంలో ఇరుక్కున్నాడని గ్రహించి, అర్జెంటు పనులమీద తప్పుకుని పోవడానికి. అతన్ని

ఆ కథ ఏమిటో చెప్పమంటున్నారుగాని అతనే ఆలస్యం చేస్తున్నాడు.

అతను ఆస్పత్రిలో చేరింది మొదలు ఎవరో కుర్రాడు అతనికి తెలీకండా అతని స్థితిని రోజుకి నాలుగైదుసార్లు తెలుసుకుని పోతూనేవున్నాడు. మూడోనాడు జరం తగ్గగానే, భోజనంలోకి మాంసంకూరా పళ్ళూ పంపారు అతనికి తెలీని బంధువులెవరో. అతనికి ఎక్కడా కూడా అంతదయగల బంధువులు లేనేలేరు. ఇంత జరిగినా, ఆ కూరపంపినవారిని ఒక్కసారి చూడాలనే కాంక్ష అతన్ని వొదలటంలేదు.

ఆ కూర ప్రతిపూటా వొస్తూంది. కూర తెచ్చిన అతన్ని పట్టుకుని తన దగ్గిరికి తీసుకురమ్మని మిత్రులతో చెప్పివుంచాడు. రాత్రి ఓ కుర్రాణ్ణి బలవంతంగా లాక్కొచ్చారు.

"ఎవరు పంపుతున్నారు కూర?"

"అక్క."

"ఎవరు మీ అక్క?"

"మా అక్క."

"ఎక్కడ వుంటుంది మీ అక్క?"

"వాళ్ళ ఇంట్లో."

"ఎందుకు పంపుతోంది?"

"మీరు మా అక్కకి బంధువులుగా!"

"మీ అక్కని ఓసారి రమ్మను."

"జరంగా వుంది."

"నయంలేదా? మందు తీసుకుంటోందా?"

"కొంచెం నయంగానే వుంది."

"ఎవరిస్తున్నారు మందు?"

"మందులేదు ఏమీలేదు"

"ఏమి?"

"నేను తెచ్చిపెడతానంటే వొద్దంది."

"మీబావా?"

"మా బావ ఎవరు?"

"మీ అక్కకి మొగుడు లేడా?"

"లేడు."

"ఎవరున్నారు?"

"నేనే."

ఇంకే మదగాలో తెలీలేదు సూర్యారావుకి.

మరి ఎవరు తన తల పగలకొట్టింది?

అతని స్నేహితులు పూరుకోలేదు. వూళ్లో భోగట్టాచేసి వొచ్చారు.

ఆమె క్రిస్టియన్ అమ్మాయి. పేరు లిల్లీ. ఆమె ఒక గార్డు కూతురు. భర్తకీ రైల్లో పనే. రెండేళ్ళకిందట రైలుకిందపడి చచ్చిపోయినాడు. ఆనాటినుంచి ఖాదరనే రౌడీ ఆమెని వుంచుకున్నాడు.

అంతవరకు సూర్యారావుతో చెప్పారు వాళ్ళు. ఇంకేమీ చెప్పవద్దని నిశ్చయించుకున్నారు. ఖాదరే సూర్యారావుని కొట్టి వుంటాడని వాళ్ళ అభిప్రాయం.

మర్నాడు రాత్రి ఎనిమిదింటికి లిల్లీ అతనికి కూరా, పిండివంటలూ తనే తెచ్చింది. ముగ్గురు మిత్రులూ అప్పుడు అతనిదగ్గరే కూచుని వున్నారు. కాని ఆమె వాళ్ళని చూసినటే

లేదు. ఒక్క నిమషం అతనివంక చూస్తూ నుంచుని తనని తను ఆపుకోలేక బిగ్గిరిగా ఏడుస్తూ అతనిమీద పడ్డది.

"కన్నా, కన్నా చచ్చిబతికావా? నాకోసం ఇంత దెబ్బ తిన్నావా? నామూలానే ఇట్లా ఐపోయావా?" అంటూ.

మిత్రులు లేచారు, వెళ్ళాలని.

"వుండండి. వుండండి. వీళ్ళు మనవాళ్లేనా?" అంది సూర్యారావుతో. ఆమె దుఃఖంచూసి ఏడుపువొస్తున్న సూర్యారావు. అవునని తలవూయించాడు. ఆమె చాలాసేపు మాట్లాడలేదు.

ఆమె మెళ్ళోవున్న ఒక్క పూసలహారాన్ని సద్దుతో ఆమె రొమ్ముమంచి చూపు తిప్పుకోలేకపోయినాడు సూర్యారావు.

"నే నింక వెళతాను."

"కాదు. ఏమిటి ఇదంతా? నీకు మొగుడు వున్నాడా?"

"అతనేనా ఇంతరౌడీ?"

"నన్నేం అడక్కు నామాట విని...."

అని ఆ ముగ్గురివేపు తిరిగి,

"ఇతన్ని తీసుకుపొండి ఈ వూరినించి. ఇక్కడవుంటే...."

"వుంటే?"

"నన్ను చూడకుండా వుండలేడు ఈయన! ఆయన చంపేస్తాడు ఈయన్ని ఈసారి గుర్తులేకుండా."

అని చప్పున లేచి వెళ్ళిపోతోంది. ఆ ముగ్గురూ ఫుట్‌బాల్ యోధులు. దాంటో పొడుగాటిమనిషి జాషువా కూచున్నపీట నించే తలుపుకి సునాయాసంగా కాలు జాచాడు. ఆమె ముందుకి పడబోయింది. పడకుండా ఆమెచేతిని పట్టుకుని వెనక్కిలాగాడు. ఆమె బాధతో అరిచింది.

లేచి ఆమె చేతిని చూశాడు. ఆమె మాట్లాడకుండా తల వొంచుకుని నిలుచుంది. చెయ్యి మోచేతిదగ్గర విరిగివుంది. అంతా వాచింది

"చూడరా సూర్యారావ్! చూడు. ఆ ఖాదరేనా విరిచింది?"

ఎంత అడిగినా మాట్లాడదు.

చివరికి సూర్యారావు లేచివచ్చి ఆమెని బతిమాలినా ఒక్క మాట మాట్లాడలేదు.

"ఎందుకు మాట్లాడవు? మేం వున్నాం. చెప్పు నీసంగతి మాతో?"

"మీకు తెలీదండీ. ఈయన్ని తీసుకుని వెళ్ళిపొండి." అంది.

"ఏమిటి తెలీదు మాకు? బూకరించకు. మేం తీసుకు పోము. మాకేం?"

లిల్లీ సూర్యారావుదగ్గిరికి వెళ్ళి పక్కమీద కూచుంది.

"వెళ్లరా? నామాట విని వెళ్లిపోరా?"

"సరేలే. ముందు నీచెయ్యి చూపించు. విరిచేశాడా? విరిచేశాడా? ఎందుకు?"

"అడుగుతారా?"

"అయ్యో! ఎట్లా భరించను?"

"ఇంక నువ్వు వెళ్ళకు ఇంటికి. వొరేయ్ మీరు లిల్లీని మన ఇంటోపెట్టి రక్షించండిరా." అనేప్పటికి ముగ్గురూ నవ్వారు.

పై సంభాషణ జరుగుతోవుంటే వాళ్లు ముగ్గురూ మధ్య మధ్య.

"కుయ్ కుయ్"

"అయ్యో. అయ్యో"

"చుప్, చుప్"

"ఆహా, ఆహా!"

"వొన్సుమోర్"

ఇట్లా అంటున్నారుగాని లేకపోతే సంభాషణ ఇంకా విచారకరంగా నడిచివుండేది.

"ఏమిత్రా? దాన్ని ఎవరూ రక్షించక్కర్లేదు. దాన్నించి నీబోటివాళ్ళని రక్షించాలి"

"ఏమండోయ్, జాగర్త. మీకు తెలీదు ఈయనకి కలగ బొయ్యే ఆపద" అంది కోపంగా లిల్లి.

ఇంతవరకూ ఓమూల కదలకండా కూచుని చిన్న చిన్న శబ్దాలు చేస్తున్న సుబ్బారావు, వాళ్ల ముగ్గురిలో పొట్టిమనిషి, సిగరెట్‌ని కింద పారేసి లేచి నుంచున్నాడు.

"ఏమిటి మహా గొప్పగు మాట్లాడుతున్నావు? నిన్ను వుంచుకున్నంతమాత్రాన వా డెవడో కలియుగ బకాసురుడైనట్టూ, నలకూబరుడైనట్టూ మాట్లాడుతున్నావు? వాడుచేసిన మహాకార్యాలు, చీకట్లో వెనకాలగా వొచ్చి నెత్తిమీద కొట్టడమూనూ, ఆడముండ చెయ్యి విరచడమూనా? మంచిపని చేశాడు. కావలసించేలే నీకు. మేం ముగ్గురమెందుకు? ఎదురుగా వొస్తే మా సూర్యారావే వాడి డొక్కచించి పెట్టేవాడు. నీవెంటబడి మతిపోయింది గాని వాణ్ణి ఓ మానవమాత్రుడు కొడతాడా? మావాణ్ణి ఎందుకు తీసుకుపోవాలి? ఏమీతీసుకుపోము. నరికి పాతేస్తాం. జాగర్త ఆవి చెప్పు ఆ తప్పుడు గాడిదతో. తెలిసిందా? నీవెంటపడ్డ ఈవూరి చచ్చుపీనిగల్ని

ఇద్దర్ని తన్నాడుగావును ఆ మహాయోధుడు! అంతకన్న గజకర్ణుడు లేడనుకుంటున్నావు. కనుక్కున్నాంలే వ్యవహారం! వాణ్ణి అట్టే వెనకవేసుకొచ్చావంటే నిన్నూ తంతాం జాగర్త. ఏమిటో మాటాట్ట, తనని చూడకుండా వుండలేట్ట, ఎందుకు వుండలేడూ? నువ్వేం రంభవా, దమయంతివా? పద, పద. మహా గొప్పగా వుంది. ఇటూ అటూ రెండు తంతేసరి. ఎందుకు చూడకుండా వుండలేడూ? ఏంరా సూర్యారావ్? చూడకుండా వుండలేవా? నిన్నూ తంతేసరి నాలుగు! ఏం ఆడవాళ్లు లేరా ఇంక? ఇదేనా మొనకత్తె! ఏముంచే విశేషం నీదగ్గర...." ఇంకా ఏముందో పరీక్షలోకి వెళ్ళబోతోవుంటే తప్పించుకు పారిపోయింది లిల్లీ. ముగ్గురూ పకపక నవ్వారు. అలిసి గావును గోడవేపు తిరిగి పండుకున్నాడు సుబ్బారావు.

ఖాదర్ని ఆరాత్రే తన్నాలని నిశ్చయించుకున్నారు వాళ్లు. కనపడితే లిల్లీని కూడా. చప్పున సూర్యారావు వాళ్ళవేపు తిరిగి,

"మీకేం బుద్ధిలేదా? దాన్నెందుకురా?" అన్నాడు.

"బతికేవున్నావా? మీ ముగ్గురి అంత్యక్రియలూ ఓసారే చేసి పోదామనుకున్నాం. ఏమిట్రా, ఎందుకు తన్నకూడదూ దాన్ని!"

"అదేం చేసిందిరా?"

నవ్వాడు సుబ్బారావు ఆస్పత్రి అదిరేట్లు!

"అదేంచేసిందిట! ఆ పక్కమీద కూచుని అడుగుతున్నాడు చూడు!"

"ఊవూర్కొచ్చి వీడికి మతిపోయిందిరా!"

"ఆడదిరా"

"అదేం చేసిందా విను. ఏం చెయ్యాలి? ఇట్లాంటి ఆడ వాళ్ళు పబ్లిక్ మెనెస్, ఏమిట్రా వీళ్ళు! వూరికే నడుస్తారా తోవ వెంబడి అందరికిమల్లే! పిర్రలు వూపుతారు. ఇటూ అటూ కళ్ళ ల్లోంచి పక్కచూపులు విసురుతారు. జడని ఇటూ అటూ పంది తోకమల్లె గిరాటేస్తారు. జడని నాజూకుగా తిప్పుతారు. చిన్న చిన్న నవ్వులు నిష్కారణంగా నవ్వుతారు. ఇంక మన సూర్యారావు వంటి బుద్ధిలేనికుక్కలు కయ్ కయ్ మని వెంటబడి, తగూలాడు కుని ఆస్పత్రి చేరుకుంటారు, దెబ్బలతోనో, రోగాలతోనో!" అన్నాడు సాంబం."వారే, కవులే ఈ దొంగపోకిళ్ళని వర్ణిస్తారు కదా! నవ్వితేట, పువ్వులు రాలాయట! ఎండకే మెరుగుపెట్టినట్ట యిందట. ఆ నడకని చూసి హంసలూ ఏనుగులూ సిగ్గుపడతాయిట. తోవ పొడుగునా ప్రేమ స్రవంతి ప్రవహిస్తుందిట. మాటలో కోకిల స్వరాలుట!"

"ఆ కవులు రాయడమేగాని వాళ్ళలో ఒక్కడూ ఆడవాళ్ళ జోలికిపోడు, తంతారని భయం. సూర్యారావు వంటివాళ్ళు ఆ పత్రికలు కొని చదివి ఆ మాటలన్నీ నిజమనుకుని ..."

"ఏంరా? ఆ చలంపుస్తకాలు చదువుతున్నావా ఏంటి?

"ఎవడో కవిరా...."

ఏనాడు నీమోవి
లేనవ్వు పొలుచునో
ఏప్రొద్దు పొడుపులో
నీ ప్రేమ మొలుచునో....

"అన్నాడురా?"

"ఒరే సూర్యారావు! ప్రేమ మొలవడమేమిట్రా?"

"వాడి తలమీద గుంటపడ్డదా! ఇంక దాంట్లోంచి ప్రేమ మొలవడమే తరవాయి"

"ప్రేమ మొలుస్తుందో, ఏం మొలుస్తుందో!"

"ఒరే, ఈ ముండమూలానే కదూ, నువ్వు దెబ్బలు తిని హాస్పటలుకి చేరింది?"

"దాన్నేమనకండి. దానికోసం దెబ్బలుతినడమేకాదు. చచ్చిపోయినా ఫరవాలేదు" అన్నాడు సూర్యారావు.

"దానికోసమేనా? ఏ ఆడదానికోసమైనా సరేనంటావా?"

"దానికోసం"

"ఏమిటా విశేషం?"

"అది దేవత."

"ఎట్లా?"

"అంతా- రూపంలో, మనసులో, సూనృతంలో."

"దేవతలంటే ఇట్టానే వుంటారంటావా?"

"ఈ గ్రామ దేవతా?"

"నువ్వు దేవుడివని ఆ దేవత నిన్ను చేర్చిందా?"

"నిన్ను తన్నిం దెవరు? గంధర్వులా?"

ఈ విధంగా అర్ధరాత్రిదాకా వాగారు. సూర్యారావు తను లేచిందాకా ఖావర్ని కొట్టకండా ఆగమని వాళ్ళని బలవంతం మీద వొప్పించాడు.

మర్నాటి రాత్రినించి ఎప్పుడో ఒకప్పుడు ఆ ముగ్గురూ లేని సమయంలో లిల్లీ వొచ్చి సూర్యారావుదగ్గర కూచుని అతన్ని ముద్దుచేసి పోతోనేవుంది. వాళ్ళు ఎంత వెక్కిరించనీ, తిట్టనీ ఆమె దగ్గిరికి వొచ్చిందంటే, సూర్యారావు ఆమె కళ్ళనంకచూసీ, వేళ్లను

తాకీ ఆమెమాటల మార్దవంలో కరిగిపోయి, 'ఇంక అంతకన్న స్వర్గం ఏముంది?' అని అనుకోడం మానలేదు. ఆ ఖాదర్ని వొదిలి తనతో వుండమంటాడు. దానికి లిల్లీ ఓసారి నవ్వుతుంది, ఓసారి భయపడుతుంది, ఓసారి ఏడుస్తుంది.

"నామీద నీకు నమ్మకం లేదా? ఆ ఖాద రేంచేస్తాడు? వాణ్ణి ఇంక ఎందుకూ పనికిరాకుండా చేసే మాట్లాడతాం నీలో" అన్నాడు.

"వొద్దు, నామీద వొట్టు; అతన్నేం చెయ్యకండి."

"అతనిమీద ప్రేమా నీకు?"

"లేదు."

"నామీద ప్రేమా?"

"ఊ"

"మరి ఇంకెందుకు?"

"అందుకనే" అంటుంది.

ఆ మాటలకి అర్థంతెలీక ఏమిటో తనకి కనపడని వలలో ఇరుక్కున్నట్టు కొట్టుకుంటాడు సూర్యారావు. ఆమెమాటల అర్థం వెతుకుతాడు. ఎందుకు స్పష్టంచెయ్యదూ? ఆడవాళ్ళు అంతేనావును.

"ఏమన్నా వుంటేగా స్పష్టంచెయ్యడానికి?" అంటాడు సుబ్బారావు.

"స్పష్టంచేస్తే ఏముందిరా వాళ్ళ వొంటోగాని, బుర్రలో గాని! అట్లా అందమైన మిస్టరీలో కప్పివుంచబట్టే, ఆ చీరే అంత షోకుగా వుండే, దానికిందది ఇంకా ఎంతషోకుగా వుంటుందో, ఆ నున్నని మెరిసేజుట్టే అంత అందమే, దానికింది బుర్రలో ఎంత అందమైన తెలివివుందో నని భ్రమసిపోతాడు మొగవాడు."

అని నవ్వేతారు ఆతని మిత్రులు.

"ఇంతకీ ఏమంటుందిరా నీ లిల్లీ!"

"ఏమంటుందీ? తానూ నిజమైన లిల్లీనే అనుకుని ఏమెరగనట్టు అటూ ఇటూ విప్పుకుని నవ్వుతోవుంటుంది, బురదమధ్య" అన్నాడు జాషువా.

"ఇక్కడేం బురదలేదు. వొచ్చి నన్ను కోసుకోండి అని ప్రతివాళ్ళనీ దొంగపిలుపులు పిలుస్తూ" అన్నాడు సుబ్బారావు.

"ఆ ఖాదర్ని కొట్టవొద్దట" అన్నాడు సూర్యారావు.

"ఇంకా?"

"నన్ను వొదలలేదుట."

"చూశారా? ఖాదర్ని ఏంచెయ్యకూడదు. వీణ్ణీ వొదలదు ఆది. వీణ్ణి వాడూ, వాణ్ణి వీడూ నరుక్కుంటూవుంటే కులాసాగా కూచుని చూస్తూవుంటుంది. లేకపోతే తనకేంతోస్తుంది? ఛీ లేవండిరా, పోదాం" అన్నాడు సాంబశి.

"మనవా దేమంటాడో కనుక్కో" అన్నాడు సుబ్బారావు.

"వాణ్ణి అడిగి లాభంలా, పదండి. మనం చేసేది చేద్దాం."

"వుండండిరా. ఎల్లుండి వెళ్ళిపోతున్నాంగా ఇంటికి, ఒక్క రోజు ఓపికపట్టండి" అన్నాడు సూర్యారావు.

"శనివారం సికింద్రాబాదులో ఫుట్‌బాల్ మేచ్ వుంది, మేం పోవాలి. నువ్వూ రా. ఈ వెధవ రైళ్ళుడుద్యోగ మేమిట్రా నీకు? ఆ నాలుగెకరాల పొలం తగలేసుకున్నావుగాని లేకపోతే నువ్వూ హాయిగా ఫుట్‌బాల్ ఆడుకుంటో తిరిగేవాడివా? కానీ ఎల్లుండినాకా వాయిదా?"

"ఇదంతా ఈ కవిత్వమూ సినీమాలూ చేస్తున్న పని."

"మేం ఆడవాళ్ళ నెరగమనుకోకు. ఆడవాళ్ళ కేమిట్రా! కావలసినంతమంది. కాని ఆ ఒక్కత్తే కావాలని ఈ ఏడు పేమిటి? వీడి ఏడుపుతో అదెంత బెట్టుచేస్తుందో తెలుసా? అంద రికీ అది సులభమే. ఈ కవిత్వం బుర్రలో పెంచుకునే వాడి దగ్గిరే దాని గొప్ప."

"వీడే దాన్ని ఆడది అనడురా. దాన్ని దేవత అంటాడు. అనగానే అది అందని అపరూప రంభగా నటిస్తుంది."

"ఆ సినిమాల్లో చూడు. తెరమీద అందరు ఆడవాళ్ల గుంపులు గుంపులుగా వొస్తారా? ఎవతైనా బాగానే వుంటుంది. కాని ఆ యోధుడు వున్నాడే. ఆ వంకర నాయకి మాత్రమే కావాలని మూడు గంటలసేపు పడరాని అగచాట్లన్నీ పడతాడు. పాడతాడు. వీడి అగచాట్లు చూసి అందరూ అడ్డపడతారు సరదాకి. తండ్రి వీల్లేదంటాడు. ఆ అమ్మాయి పారిపోతుంది. దొంగలు కూడా ఎత్తుకుపోతారు. పాములు కరుస్తాయి."

"పాములేమిటి కప్పలుకూడా కరుస్తాయి."

"ఆడదాన్ని అంతగా గొప్పచేసుకునేవాణ్ణిచూస్తే అంద రికీ కోపమే! అసహ్యమే! ఆ పెళ్ళికూతురికీ అనుమానమే, వీడి పాటలూ, కులుకులూ చూస్తే. అటూ ఇటూ రెండు తన్ని దాన్ని తీసుకుపోక."

"తన్నగలిగినవాడు ఆ పాటలు పాడుకుంటో ఎందుకు తిరుగుతాడురా!"

"ఆ రతన్ చూశావా? దానికి వేరే పెళ్ళి సంబంధం కుదిర్చిందాకా అట్లా చూస్తో వూరుకుంటాడు. ముందుగానే ఆ బండీలో వేసి తీసుకుపోతే ఏ గొడవా వుండేది కాదు. పెళ్ళి

కానిచ్చి ఓమూలకి పోయి, లోకంలో తన కెవరూ లేరని ఏడుస్తాడు."

"ఆ పెళ్ళి అవుతోంటే, అప్పుడు వెళ్ళడు. పెళ్ళి కానిచ్చి తరువాత ఏడుపు ప్రారంభిస్తాడు."

"కొందరికి ఏడుపంటే, చావంటే ఇష్టంలాగుంది. మన సూర్యారావూ ఆ జట్టులోవాడులాగే వున్నాడు;"

"ఒరే సూర్యారావ్ పోనీ సినిమాల్లో చేరరాదురా నువ్వు"

"హారే నోరు మూస్తారా? లేచి తన్ననా? ఇంక పొండి, నిద్రవస్తోంది. ఎల్లుండివాకా వాయిదా."

అంతటితో నవ్వుకుంటో లేచిపోయినారు వాళ్ళు.

ఆ ఎల్లుండి వొచ్చేప్పటికి ఎవరి ప్రయత్నం లేకండానే వ్యవహారం దానంతట అదే తీరిపోయింది.

ఆ మధ్యాన్నం ఆస్పత్రినించి డిశ్చార్జి ఐన సూర్యారావుని ఇంటికి తీసుకుపోయినారు.

ఆరాత్రి బైలుదేరి ఖాదర్ని తన్నడం డిస్కస్ చేసుకుంటున్నారు. ఆ లిల్లీ ఇంటికిపోయి ఇద్దర్నీ ఓసారే కలుసుకోవాలని వాళ్ళ ఉద్దేశ్యం. ఇంతలో తలుపు తెరుచుకుని బూచివాడిలాగు ఒక లాటీతో వాళ్ళముందు సాక్షాత్కరించాడు ఖాదర్. నీలుగుతూ గోడలకి జార్లబడివున్నవాళ్ళు కాస్తా ఆ లాంతరు గుడ్డి చీకట్లలో భయంకరరూపాన్ని చూస్తూ వుండిపోయినారు.

"ఎవడ్రా నన్ను తంతానంటున్నాట్ట....(బూతులు) తన్నండిరా. నరికి ఇక్కడే పాతేస్తా" అంటూ వాళ్ళవంక చుట్టూ చూశాడు.

"ఎవడ్రా నువ్వు!" అన్నాడు సాంబ. శివ రావు

"నీ అక్క మొగుణ్ణిరా" అని లాఠీ ఎత్తాడు. వాడి కాళ్ల సందుకు ఒక్క మాకులో పాకాడు సుబ్బారావు. ఖాదర్ బోర్ల బొక్కలా పడ్డాడు సూర్యారావుమీద. రెండు నిమిషాల్లో లాఠీ లాగెయ్యడం, ఖాదర్ దవడమీద నాలుగు గట్టివి—ఇంక రెండు నెలలవరకు ఆ దవడ పనిచెయ్యకండా – ఇచ్చుకోవడం జరిగింది. మళ్ళీ ముగ్గురూ ఎవరి స్థానాల్లో వాళ్లు గోడ నానుకుని కూచున్నారు. తన నెప్పులకి నర్సింగ్ చేసుకుంటో కూలబడి వున్నాడు ఖాదర్. అప్పుడే మొహం వికృతంగా వాచుకొస్తూంది.

"చూసుకోండి. అప్పుడే అయిందీ మీపని? రేపు తీసు కొస్తా మావాళ్ళని" అంటున్నాడు.

"ఏడిశావులే. రేపటిదాకా నువ్వు బతికివుంటేకద మీ వాళ్ళని తీసుకురావడం?"

"నీకు మూడు నెలలవరకు మాటవొస్తేకద ఎవరితోనన్నా చెప్పుకునేందుకు?"

"నీసంగతి మాకు తెలుసులేరా ఖాదర్. నీకు నీవాళ్ళనే వాళ్లుంటే వాళ్ళిదివరకే బాగా బుద్ధిచెప్పేవాళ్ళు నీకు. ఈ కోమట్ల ముందు డాబుగా వొస్తాదునని దడిపించి తిరిగావు ఇన్నాళ్లూ. ఈనాడు నీ మొగుళ్లు దిగారు ఈవూరు. మహా వొస్తాదువిరా చీకట్లో మనిషిని కొట్టడానికి. సిగ్గులేదురా."

"నా పిల్లజోలి కెందుకొచ్చాడు?"

"నీ పిల్లజోలి కెవరూ రాలేదు. నీ పిల్లే వొచ్చింది మావాడి జోలికి. నీపిల్లని నువ్వెందుకు జాగ్రత్తపెట్టుకోక వూరిమీద వొదులుతావురా!"

"నేను వొదిలానా? అది నిలవదు....నేను...."

అంటో ఏడ్చాడు ఖాదర్.

తనకి తగిలిన దెబ్బలకి కాదు. తను రెండేళ్ళనించి పడు తున్న బాధని తలుచుకుని గావును.

"అది చెడిపోయిన మనిషి.... అణాకీ, బేడకీ సిద్ధం అది....అట్లాంటిదాన్ని తెచ్చి మందిప్పించి, శుభ్రంచేసి, నా ఇంటికి పెద్దనిచేసి పెట్టుకుంటే.... (ఏడుస్తున్నాడు)....నేను బైటికిపోతేచాలు....అది వుత్త కుక్క....ఎవడితో నంటే వాడితో రైలుగార్డులు లేరూ ఆ నాలుగు నిమిషాల్లో వాళ్ళ పెట్టెల్లో దూరుతుంది. పోలీసువాళ్ళందరూ ఇలాకా దానికి....ఒకడేమిటి? ఏం చెయ్యను? వాళ్ళని తంతాను....ఎందర్నని ఎన్నిసార్లని తన్నను?"

"దాన్ని తన్నవేం?"

దాన్ని, దాన్ని....ఒక్కొక్క గుద్దుకి శేరు రక్తం కక్కు తుంది. మర్నాడు అంతే మళ్ళీ....

పడిపడి నవ్వుతున్నాడు సుబ్బారావు సూర్యారావువంక చూస్తూ.

"దాన్ని చేతులు కాళ్లు అన్నీ విరుస్తాను. ఒకసారి వురే శాను....కాని మళ్ళీ ఏడుస్తాను. అదేంపిల్లండీ? అది మనిషి కాదు; దేవత. దాంతో పడుకుంటే....నేనూ చూశా చాలా ఆడవాళ్ళని.... కాని వాళ్ళందరూ దీనిముందు వుత్త దిష్టిపిడతలు. ఇది మనిషికాదండీ....సైతాను. అది రాక్షసి. నా ప్రాణం కొరుక్కుతినేసింది....చీరెలు, డబ్బు ఏమడిగితే అది ఇస్తా. దీని కోసం నా ఉద్యోగం వొదులుకున్నా. బికారి నైపోయినా, దీనికి కావిలికా నేందుకు. దాని కాళ్ళమీద పడి బతిమాలుతా."

"వొదిలెయ్యరాదూ?"

"వొదిలేసి పోయినాను ఓసారి. కాని ఒక్కసారి దాన్ని మరిగితే ఇంక దిక్కులేదు మొగాడికి. నేను వాళ్ళ నడుం విరక్కొట్టినా వొదలరు దాన్ని. మొగాళ్ళు నావీపు తిప్పగానే దాని చుట్టూ చేరతారు ఒక్క ముద్దుకోసం ...ఎటువంటివారు! ఆ తాసిల్దారు, పొగాకుకంపెనీ దొర....ఆ ట్రాఫిక్ యినస్పెక్టర్.... ఎందరని చెప్పను? వొదల్లేను దాన్ని....వొదిలి బతకలేను... ఇన్నీ చేసినా ఇంటోకివొస్తే చాలు అది....నావొళ్ళో కూచుని కళ్లపైకెత్తి నవ్వితే చాలు. ఓసారి చచ్చిందనుకున్నా నేను గుండెల్లో తంతే....నేనూ చచ్చిపొయ్యేవాణ్ణే. ఏం చెయ్యను?"

అని ఏడుస్తున్నాడు.

"చూశావా సూర్యారావ్, విన్నావా? ఏదో దేవకన్య అన్నావు దాని హృదయం సముద్రమంత విశాలమన్నావు. అంత విశ్వాసం, ప్రేమా ఎరగనన్నావు...."

"ఖాదరేం కవిత్వం చదివాడు?" అన్నాడు సూర్యారావు.

"అంతేనండి. అది అంతే నాకు జరం వొస్తే ఆ రెండు నెలలూ కుక్కలాగ నిమిషం కన్నుమూయ్యకండా రక్షించి నాకు సమయంవొస్తే ప్రాణమిస్తుంది. ఏ తల్లి, ఏ భార్య చేస్తుందండి అలా! కాని అది సైతాను, బ్రహ్మరాక్షసి........" అంటోవుండగా లిల్లీ వొచ్చి నుంచుంది వాళ్ళమధ్య. ఖాదర్‌ని చూసి,

"అయ్యో! ఖాదర్, ఏమిటిది?" అని అతనిమీద విరుచుకుపడ్డది. సాంబం లేచాడు.

"ఇంక చాలు ఈ నాటకం. ఒరె ఖాదర్ ఆ పిల్లని తీసుకుని నీయింటికి పో" అన్నాడు.

"వాళ్లేనా నిన్ను కొట్టింది?" అని బూతులు తిడుతోందిలిల్లి!

"చాలా ఉత్తమమైన వాక్కురా, నీ ప్రియురాలిది సూర్యారావ్" అన్నాడు సుబ్బారావు. లిల్లీ సూర్యారావు వంకకి జరిగి, అతని తొడమీద చెయ్యేసి మధురంగా,

"నయంగావుందా?" అని అడిగింది. అసలే కదులుతూన్న పళ్ళని కొరకాలని ఖాదర్ వ్యర్థప్రయత్నం చేశాడు. గుర్తురిమి చూశాడు. కాని చీకట్లో ఎవరికీ కనపడనందున, చాలించుకున్నాడు ఆపని.

"లేవండి, పదండి ఈపాటి" అన్నాడు సుబ్బారావు.

"వీల్లేదు" అన్నాడు ఖాదర్.

"నోరుముయ్యి. ఇంతలో ఈ రాత్రికేం చెడిపోదులే నీ పిల్ల!" అన్నాడు జాషువా.

"వీల్లేదు చంపేస్తాడు లిల్లీని" అన్నాడు సూర్యారావు.

"చంపెయ్యనీ. లోకకల్యాణమౌతుంది."

"వీల్లేదు. నేను భరించలేను"

"ఎట్లానూ చంపడ్రా. చంపేవాడైతే ఎప్పుడో చంపేవాడు. ఎప్పుడో దాని మూలాన వీడే చస్తాడు."

"చంపేవాడు మొదట్లోనే చేస్తాడు ఆపని."

"అతను చెప్పినవన్నీ నిజమనుకుంటున్నారా?" అన్నాడు సూర్యారావు.

"ఏం లిల్లీ?" అన్నాడు సాంబం.

"అన్నీ అబద్ధాలు, నామీద ద్వేషం పుట్టించడానికి మీకు."

"ఏంచెప్పాడో నీమీద నీకెట్లా తెలుసు?" అన్నాడు కోర్టులు తిరిగిన జాషువా.

"ఏం చెపుతాడో నాకు బాగా తెలుసు."

"పోనీలే. నిజాలు కానీ, అబద్ధాలు కానీ వెళ్ళనీ వాళ్ళని"

"నిన్ను తన్నినందుకు వాడికిశాస్తిచేశాం. ఇంక నీజోలికి రాడు."

"రాడా? వాణ్ణి చంపి ..." అంటున్న ఖాదర్‌ని డొక్కలో ఓ పెద్దతన్ను తన్నాడు జాషువా. దాంతో ఖాదర్ కళ్ళుమూశాడు.

"చస్తాడేమో కొంచెం నీళ్ళు కొట్టండిరా."

"ఫరవాలేదులే సూర్యారావూ నోరుమూసుకు పడుకో. వీళ్ళసంగతి చూస్తాం మేము."

"వీణ్ణి తన్నాంగాని మనం అసలు దీన్ని తన్నవలిసింది." అన్నాడు సాంబం.

"ఒసేయ్! నువ్వు మావాడి ప్రమేయం లేకుండా వొదిలి పోతావా, లేకపోతే ఇంక గుర్తులేకుండా నీ మొఖాన్ని మార్చ మంటావా ?"

"అడుగుతావేం మర్యాదగా! లోకకళ్యాణంకోసం ఆపని చెయ్యాలిరా! ఆ విష్ణుదేవుడు పురుషుల్ని నాశనం చెయ్యడానికి అన్ని అవతారాలెత్తాడు గాని, అసలు బుద్ధివున్నవాడైతే ఆ దుష్టత్వానికి కారకులైన స్త్రీలని చంపడానికి ఎత్తవలసిందిఅవతారాన్ని"

"అసలు నిజమేమిటో కనుక్కోండిరా" అన్నాడు సూర్యారావు.

"చెప్పాడుకదా ఖాదర్."

"ఖాదరుకాదు. లిల్లీని చెప్పమనండి."

"ఒరే బాబూ, నువ్వేదో తెలివిగలవాడివనుకున్నాం...."

"తెలివిగలవాడేరా! మరి ఈ స్థితిలో పడ్డాడు"

"ఆడదానినోటినుంచి నిజంవస్తుందిరా? మూడురోజులు లెక్చరిస్తుంది. కాని నిజం ఎట్లా వొస్తుందిరా! నిజం బైటపడితే. నోరుమూసుకుని, మాటరాని ముద్దరాల్లాగ, మన గుండెలమీద కళ్ళతో పనిచేస్తుంది"

"కాదురా. నాతో చెపుతుంది. చెప్పవా లిల్లీ."

"ఊఁ. మీతో వొంటరిగా...."

"వీల్లేదు."

"ఏమిట్రా? ఆడది సిగ్గు విడిచి ఎట్లా మాట్లాడుతుంది మీ అందరి ముందూ?" అని బతిమాలాడు సూర్యారావు.

"పోనీరా మాట్టాడనీ"

సూర్యారావు మెల్లిగా లేస్తున్నాడు బాధతో.

"సూర్యారావూ, వుండు. మేమే వెడతాం! ఖాదర్ లే, మాతో షికారు రా. సూర్యారావు, ఓగంటలో వస్తాం మళ్ళీ"

కాని ఖాదరు ఓపట్టాన రాలేదు. లిల్లీచెయ్యి లాగుతాడు. చివరికిబలవంతంగా నెట్టుకుంటో తీసుకు పోయినారు, అతన్ని.

వాళ్లు వెళ్ళడంతో అమాంతం లిల్లి సూర్యారావుమీద పడ్డది. అతనిరొమ్ములో మొహంపెట్టి.

"కన్నా, కన్నా, నువ్వులేంది బతకలేను. తీసుకో, రా, దగ్గిరికి రా" అంది.

అతను ఆమెని నెట్టేసి కఠినంగా లేచి కూచున్నాడు.

"ఖాదరు చెప్పేవన్నీ నిజమేనా?"

"ఆ"

"ఖాదరేం చెప్పాడో నీ కేం తెలుసు?"

"ఖాదరు అబద్ధం మాట్లాడడు"

"ఏమి టా రోగం నీకు?"

"నేనూ? "నువ్వు నాప్రాణం నిన్ను చూస్తే...."

అంటో అతనిపక్కన పడుకుని నిలువునా తనకి అద్దుకుంది. ఆతనికి అన్ని సందేహాలూ తీరిపోయినాయి.

.... .... ....

గంటసేపటికి వాళ్ళు నలుగురూ వొచ్చేటప్పటికి ఆ ఇంటో ఎవరూ లేరు. సామానూలేదు. దూరంగావెళ్లే పన్నెండు గంటల పాసింజరు గార్డుపెట్టివెనక ఎఱ్ఱదీపం కనపడుతోంది. ఖాదరు చిందులు తొక్కుతున్నాడు.

"ఎత్తుకుపోయినాడు. ఇదంతా కుట్ర." అంటున్నాడు.

సూర్యారావుని తలుచుకుని ముగ్గురు మిత్రులకీ చాలా అసహ్యంగావుంది. కాని—

"ఏడిశావులే." అని ఖాదరునమ్మీద తన్నాడు సాంబం.

"వాణ్ణి మూడులోకాలూ వెతికి పట్టుకు చంపుతాను" అన్నాడు ఖాదర్.

"ఏడిశావు, తీసుకుపోతే పోయినాడు. ఇంకోపిల్లని చూసుకో. కాని వాడి వొంటిమీద చెయ్యిపడ్డనా పధ్నాలుగులోకాలూ వెతికి నిన్ను నరుకుతాం జాగర్త."

అని ముగ్గురూ రైలుస్టేషన్‌కి వెళ్ళిపోయినారు, సూర్యారావు ముందు జాతకాన్ని విమర్శించుకుంటో. అర్ధరాత్రి శూన్యమైన ఆ ఇంటో, లోకమే శూన్యమై ఖాదరు ఏడుస్తున్నాడు. దూరంగా గ్రామఫోను

దునియామె కోన్ హమారా అని పాడుతోంది.



# ముక్కాలుపీట

రాత్రి హోటలుడాబామీద కూచుని నలుగురుసేట్లూ బెజవాద పడమటి కొండలకేసి చూస్తున్నారు. ఎనిమిదైనా ఇంకా ఓలేతకాంతి కొండమధ్యనించి బెజవాడమీదికి చాచుకునే వుందనిపిస్తోంది. రైలుస్టేషన్ ఎర్రపచ్చ దీపాలూ తరువాత క్రమంగా ఎత్తవుతూ కొండమీదికిపాకే దీపాలవరసా చూస్తున్నారు ఎంత అందమూ అని. కృష్ణవంతెనమీదనించి రైలు వస్తో, తెల్లనిచారని ముందుకు నెట్టుకుని వెతుక్కుంటోంది తోవ. వాళ్ళని భోజనానికి రమ్మన్న ఇన్‌స్పెక్టర్ రామరాజు అరగంట ఆలస్యంగా వొచ్చాడు.

'ఏమిటీ ఆలస్యం అన్నాడు!' బొంబేనించి ఇద్దరు తోటి సేట్లని వెంటపెట్టుకు వొచ్చిన సింహాచలం.

'పోలీసు ఉద్యోగం. ఇవాళ....'

"ఎన్నిసార్లు చెప్పాలి, ఈపాడు పోలీసుఉద్యోగం నీ కెందుకని? నా కర్మాగారంలో చిన్న మానేజరుకి అయిదువందల రూపాయల జీతం.

"ఇతనిని నా partnerగా కూడా తీసుకుంటాను రమ్మన్నాను. ఇంతకంటె fool వుంటాడా?" అన్నాడు ఆ ఇద్దరు సేట్లతో సింహాచలం.

"కాని, డబ్బు సంపాదనలో ఈ ఉద్యోగములో వొచ్చే త్రిల్ వుంటుందా?" అన్నాడు రాజు.

"లేకేం? డబ్బు సంపాయించడాన్ని మించిన త్రిల్ లోకం లోలేదు. డబ్బేకాదు. కొత్తమార్కెట్లు, తక్కిన కంపెనీలతో పోటీ!" అన్నాడు సింహాచలం.

"నీ కొక్కడికి త్రిల్, వేలమందికి వుత్త బండచాకిరీ, నీ కర్మాగారంలో."

"వాళ్ళకిమాత్రం? నువ్వు పట్టుకునే దొంగలకి నిన్ను తప్పించుకునే త్రిల్ లేదంటావా?"

"వుందేమోలే. దొంగలకి భయం. కార్మికులకి దరిద్రం."

"అందుకనే పరిశ్రమలు జాతీయం చెయ్యడం చాలా మూర్ఖమంటాను!" అన్నాడు ఒకసేట్ అసందర్భంగా.

"రష్యా సంగతేమిటి?"

"రష్యాఐనా అంతే. ప్రస్తుతం ఏవేవో ప్రయత్నాలూ, కలలూ, ఎంతకాలం? అదిగాక యుద్ధాలువొస్తాయని త్రిల్. అవి పోనీ జీవితంలో ఇన్టరెస్టు పోతుంది."

"సరేకాని, నీ ఆలస్యానికి ఏదో కారణం చెబుతున్నావు?"

"అవును, మనవూరు కొత్త రైల్వేఇంజనీరు లేడూ దొరస్వామి, అతాత్తుగా మధ్యాన్నం అతనిగదిలోకి ఒకామెవొచ్చింది. ఎవరో తెలుసా? రాజగోపాలాచారి కోడలు. వొచ్చీ రావడంతో కుర్చీలో కూచున్న అతని మెడను కావిలించుకుని ముద్దుపెట్టుకుంది. దొరసామి అందమైనవాడు. అతన్ని మొన్న తులాభారం నాటకంలో చూసిందట. మొగుడు ఆమెని మొగాళ్ళలోనే కూచోపెట్టుకుంటాడుగా! పైగా తన సొంతకారులో తనే డ్రైవ్‌చేసుకొంటూ వెళ్ళిందట ఆఫీసుకి. హడిలిపోయినాడు అతను. బల్లకీ కుర్చీకీ మధ్య దూరి అతని వొళ్ళో కూచుని మెడచుట్టూ చేతు

రేసి ముద్దులాడుతోంది. అతనికి ఎదురుగా పెద్దకిటికీలోంచి గుమాస్తాలు కనపడుతున్నారు ఇదంతా చూస్తో. అతను లేచి, వచ్చీరాని తెలుగులో 'ఎవరు? ఎవరు?' అని అరిచాడు.

"నువ్వు నా భర్తవి. నువ్వే అసలు భర్తవి. నాకు దేవి చెప్పింది. నీ భార్యని పంపించెయ్. ఆఫీసుఐపోగానే మన ఇంటికి పోదాం" అంది.

పిచ్చిదా? ఆదేమన్నా వేషమా? మోసమా? పాపం అతను గుమాస్తాల్నీ బంట్రోతుల్నీ పిలిచి ఏమిటో కనుక్కోమన్నాడు. వాళ్లతోనూ ఆదేమాట. వాళ్ళు ఆమెని గుర్తించి భర్తకోసం పరుగెత్తారు." అని ఆగాడు రామరాజు.

అటు వెడుతున్న Prof. జగన్నాయకులు వాళ్ళని చూసి దగ్గిరికి వొచ్చి నుంచున్నాడు.

"రాజగోపాలాచారి కోడలు సంగతేనా? చాలా చిత్రం" అన్నాడు జగన్నాయకులు.

"ఆ భర్త వొచ్చేలోపల చాలా అల్లరిచేసింది ఆమె! తన జాకెట్టు తీసెయ్యడం, అతని కోటు లాగెయ్యడం ఇట్లాంటివి. ఇంక ఆమె ప్రేమప్రదర్శనం, మోహం చూసితీరవలిసిందేట."

"ఆమె అందంగా ఉంటుందా? యవ్వనవతా?" అన్నాడు ఒకసేటు.

"చాలా"

"అందరిలో ఆఫీసులో జరిగిందిగాని వొంటరిగా జరిగితే ఈ గొడవే లేకపోను. ఆ ఇంజనీరు తెలివి గలవాడైతే, చల్లగా జాగ్రత్తగా ఏర్పాట్లు చేసుకునేవాడే" అన్నాడు రెండోసేటు.

"మీ కా అద్రుష్టం రాకపోయిందనే దిగులా?"

"నిస్సందేహంగా. నేనైతేనా ఆఫీసులోనైనాసరే, చాలా చక్కగా manage చేసేవాణ్ణి."

"తరువాత?"

"భర్త వొచ్చాడు. వొస్తే ఆమెచాలా స్పష్టంగా శుభ్రంగా మాట్లాడింది. 'ఇంక మీకూ నాకూ సంబంధంలేదు. మీరు నాకు భర్తేమిటి? వేరే పెళ్ళిచేసుకోండి. ఇంక ఈయనతో నేను చాలా గొప్ప స్వర్గం అనుభవించబోతున్నా'నని. లాక్కెళ్ళారు కారులో పడేసి ఆమెని భర్తా వాళ్ళూ. రేపణ్ణించి ఏమవుతుందో చూడాలి."

"ఆమె ఇదివరకంతా మామూలుగానే వుండేదా?"

"మళ్ళీ యింటికి వెళ్ళేంతవరకు మామూలుగానే వుంది. అక్కణ్ణించే వొస్తున్నాను. డాక్టరుతో మాట్లాడుతూ వుండిపోయి."

"అందరూ ఏమంటున్నారు?"

"ఏమైతేనేం చాలా ఇన్‌ట్రెస్టింగా వుంది"

"ఆమాత్రం ఏవో ఈవెన్ట్సు జరక్కపోతే జీవితం చాలా డల్ గా వుంటుంది."

"కొందరు మనుషులే ఈవెన్ట్సు. నోరి వెం.కటేశ్వర్లు బతికివుండవలసింది. ఈ వ్యవహారంమీద అతని కామెంట్సు వినడం ఒక ట్రీట్. అతను పోయింతరువాత మనవూరు ఎంత చిన్నపోయింది!"

"గోపాలరావు వెళ్ళిపోయిం తరవాతో?"

"నిజమే."

"ఈ సంగతిని గురించి మీ అభిప్రాయ మేమిటి?" అని అడిగారు మనోశాస్త్రవేత్తని జగన్నాయకుల్ని.

ఈ జగన్నాయకులు ఎట్లానూ వొదలడు, భోజనం పెట్టిందాకా అనుకున్నాడు రామరాజు.

"ఇది temporary mental aberation."

"ఏదన్నా గ్రహమేమో?"

"గ్రహాలూ, పూనడాలూ, దెయ్యాలూ అన్నీ అంతే."

"Sub-conscious disturbance."

"మరి భూతవైద్యంతో నయమవుతాయే!"

"S tock theraphy అది. ఇదేమిటి? ఇంతకన్న చిత్రమైనది మొన్ననే జరిగింది చెబుతాను వినండి."

ఎట్లాగూ వొదలడు. భోజనం పెట్టిందాకా చెబుతోనే వుంటాడు. ఏం చేస్తాం? అనుకున్నాడు రామరాజు.

"గోవిందరాజులు కలకత్తానించి శలవమీద సొంత వ్యవహారాలు చూసుకోడానికే తణుకు వచ్చాడు. అతని అన్నగారి ఇంటో అన్నకూతురు సులోచన్ని చూసి,

"ఎప్పుడు వొచ్చింది అత్తవారింటినించి?" అని అడిగాడు.

సులోచనని శ్యామరావుకి ఇచ్చారు. అతను నెల్లూరులో గొప్ప వకీలు. మొదటిభార్య ముప్పైఏళ్ళకే పోయింది. సులోచన తరువాత భార్య.

"అయ్యో! సులోచనకి అత్తవారిల్లు కూడాను" అని ఏడ్చింది అతని వొదినగారు.

"ఏమిట్రా అన్నయ్యా, శ్యామారావు పోయినాడా?"

"పోయినా పీడా వొదిలిపోను. శ్యామారావు సులోచనని తీసికెళ్లాడు. అంతే. ఏంలేవట. మొదటిభార్య దుర్గఫోటోని పెద్దది చేయించి వేళ్ళాడకట్టాడు ఖద్దరు దారాలతో. ఈ రెండో పెళ్ళాం

పని - పొద్దున్నే అతనితోకలిసి ఆ ఫొటోకి పూజలు చెయ్యడం, దణ్ణాలు పెట్టడం. ఇది ఎవరితో చెప్పుకుంటుంది? పీనైనప్పు డల్లా దుర్గని పొగిడి ఆమె ఆదర్శమని, ఆమెతో పోల్చి దీన్ని సిగ్గుపరచడం. ఇప్పుడు ఆ దుర్గ ఓ దేవత. అన్ని సుగుణాలూ పాతివ్రత్యాలూ గొప్పదనాలూ అన్నీ ఆమెవే. పొద్దస్తమానం వొడకాలి. ఎందుకంటే, దుర్గ ఖద్దరు ధరించేది. ఆ దుర్గ సంగతి మన కెవరికీ ఏమీ తెలీనట్లు. ఓసారి పండక్కి వొచ్చి నప్పుడు సులోచన ఏడ్చింది. నేను వెళ్ళి అతన్నే ప్రశ్నించాను. ఈవిషయంలో మాత్రం మనమనిషి కాడు అతను. తక్కిం దంతా బుద్ధిమంతుడూ స్వార్థపరుడూ. తనెట్లా బాగుపడాలో బాగా తెలుసు. మంత్రి అయ్యే ఛాన్సుకూడావుంది. అడిగితే "నా మొదటి భార్య శలవురాలే దంటాడు. దేనికి? రెండోభార్యతో కాపరానికి. ఏంమాట్లాడినా అదేమాట!"

"చాలా చిత్రంగా వుందే. వుండు, నేను మద్రాసు వెళ్ళే ప్పుడు చిగి కనుక్కుంటాను. వాడు నేనూ కలిసి చదువుకున్నాం కదూ?" అన్నాడు గోవిందరాజులు.

భోజనం దగ్గర సులోచనను పరిహాసమాడాడు, సవితి ఫోటో పూజసంగతి.

"చిన్నాన్నా! నాన్న చెప్పినకారణం ముఖ్యమనుకోకు. అదిసరేలే. ఆ పూజలూ, ఆ దుర్గమహత్యాలూ, పాతివ్రత్యాలూ, ఆదర్శాలూ, ఆ ఉపన్యాసాలు వింటో వుంటే ఆ ఫొటోని కిందికి లాగి, బద్దలుకొట్టి ఆయననెత్తిమీద విసిరి కొట్టాలనిపిస్తుందనుకో. ఏంచేసినా ఆ ఇంటో నిలవడం కష్టం."

సులోచన అందమైనది; చదువుకున్నది. తెలివయింది.

"సరేలే నేను వెళ్ళి మాట్లాడి వొస్తానుకదూ?"

"మాట్లాడితే మాట్లాడులే. కాని నే నక్కడికి కాపరానికి వెళ్ళేది వుత్తది."

"అదేమిటి?"

"అంతేలే. 'అదేమిటి?' అంటావు. నీకేం? అందుకనే మొగవాళ్ళకి ఇంతబుద్ధిలేదేమా అనుకుంటాము. అవేవో షరతులు పెడతావు. వొప్పిస్తావు. కాని ఆ మనిషి. ఆ మనసూ? అదేం చేస్తావు? ఒక పిచ్చి అనకో, ఓ ముక్కాలుపీట పెట్టారు. దాం టోంచి ఆమె రోజూ సందేశాలు పంపుతుంది. ఆప్రకారం జరిగించి తీరాలి. ఓరోజు 'ఈరాత్రి మేలుకున్చో' అంటుంది. ఆమాటతో ఇంటో ఎవరికీ నిద్రవుండదు. ఓరోజు 'కాబూలు ఆపిల్సు కావాలి' అంటుంది. ఇంక కొన్ని వారాలు వాటికోసం ప్రయత్నం. 'సులో చనని కొప్పుపెట్టి పసుపు పూసుకుని, నీలంఖద్దరుచీర కట్టుకుని కనపడమను' అంటుంది. ఓరోజు 'దిసిమొలగా కూచోమను' అంది. అంతే. ఆ ఆజ్ఞకూడా పాలించవలసిందే."

"బావుంది."

శ్యామారావు బుద్ధిహీనుడు కాడు. తనేమో డబ్బు సంపాద నలోవుండి భార్య దుర్గని స్వదేశోద్యమంలో ప్రవేశపెట్టాడు. ఎటువచ్చినా నష్టపడకండా వుండడానికి. ఆమె రెండుసార్లు జైలుకు వెళ్ళింది. ఆటుతరువాత తిరగడం రుచిమరిగి ఇలు పట్ట కుండా ఉద్యమంలో పనిచేసింది. ఇంకేం? అందమైన ఆడ ఆమెకి రావలసిన ఆపవాదులో నిజంవాదులో బోలెడు వొచ్చాయి. చివరి యిద్దరు పిల్లలకీ శ్యామారావు పోలికలే లేవు. ఈనాటి ప్రసిద్ధ నాయకుల ఇద్దరి పోలికలు అచ్చుపడ్డి వున్నాయి మరి.

పాపం పుణ్యం భగవంతుడికి తెలియాలి. ఎట్లా అయితేనేం, ఆమెకి జబ్బుచేసింది. జైలువల్లా ఉద్యమ ఉష్ణతవల్లా ఆరోగ్యం బలిఅయిందన్నారు. ఆమాట నిజమే. ఉద్యమంలో వాళ్ళవల్ల పట్టుకున్న రోగాలే అవి. చివరికి చచ్చిపోయింది. చచ్చిపోతుం దనగానే శ్యామారావు ఆమెకి చాలా ఫొటోలు తీయించాడు. దహన సంస్కారానికి గొప్పఊరేగింపు జరుగుతుంది రమ్మని నాయకులకి టెలిగ్రాము లిప్పించాడు. పత్రికల్లో ఫొటోలతో సహా ప్రకటించాడు. చచ్చిపోయినాక అందరుమతాలవాళ్ళచేతా ప్రార్థనలు చేయించి అస్తులకి పూరిచందాలమీద గొప్పసమాధి కట్టించాడు చలవరాతితో ఆ తరవాత నాయకుల అభిప్రాయాలు తీసుకొని ప్రతి పత్రికలో ప్రకటించాడు. కవుల్ని బతిమాలి డబ్బుపెట్టి పద్యాలు రాయించి పుస్తకం వేయించాడు. దేశం మీద చందాలు వేయించి, ఆమెపేర ఒక నేషనల్ పాఠశాలా, ఒక ఆయుర్వేద ఆస్పత్రీ పెట్టించాడు. అంతవరకు తెలుసు చరిత్ర గోవిందరాజులకి. ఇప్పుడు ఈ కొత్త విశేషం. మధ్య మధ్య బంధువులకీ నాయకులకీ ఉత్తరాలు వెడుతోవుంటాయి- దుర్గాదేవి సందేశం అని పైనరాసి.

"ఈవారంలో గవర్నరు జనరలుతో రాయబారంపెడితే అనుకూలిస్తుంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"మీ అబ్బాయి జరం త్వరలో నయంగా వుంటుంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"మీభార్య రహస్యంగా వ్యభిచరిస్తోంది." దుర్గాదేవి ఆజ్ఞ.

"అష్టమినాడు ఉత్తరాన దుమ్మచెట్టుకి మేకుకొడితే మీకు అదృష్టం" దుర్గాదేవి ఆజ్ఞ.

"మంత్రివర్గం వెంటనే రాజీనామాచెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"అర్జెంటీనా సహాయం అభ్యర్థించండి" దుర్గాదేవి ఆజ్ఞ.

ఇట్లాంటి ఉత్తరాలు రోజురోజూ దిశదిశలకీ వెడుతో వుంటాయి. ఇంగ్లీషు గవర్నర్లకి కూడా వెళ్ళేవి.

"పందిమాంసం తినడం మానెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"మీరు మెసపిటోమియానించి లేచిపొండి." దుర్గాదేవిఆజ్ఞ.

"సైన్యాధిపతిని బదిలీచెయ్యండి" దుర్గాదేవి ఆజ్ఞ.

"రామ్సేమేగ్డనాడ్ కూతుర్ని హైదరాబాదు నవాబు బావమరిదికిచ్చి పెళ్ళిచెయ్యండి." దుర్గాదేవి ఆజ్ఞ.

గోవిందరాజులు మద్రాసు వెడుతూవుండగా రైల్లో కోసల రావు కనపడ్డాడు. అంతకన్న కావలసిందేమని కోసలరావుతో శ్యామలరావు ప్రస్తావన తెచ్చాడు గోవిందరాజులు. "శ్యామలరావు పని చాలా ఆశ్చర్యం. చచ్చిన భార్యని తనఘనతకి బాగా ఉపయోగించుకున్నాడు. కాని ఇప్పుడు ఆ భార్య దెయ్యమై అతన్ని లొంగ తీసుకుంది. ఆ ముక్కాలుపీటవ్యవహారం చాలా సీరియస్‌గా సిన్సియర్‌గా నమ్ముతున్నాడు తెలుసా? అతను పంపే ఆ సందేశాలు అన్నీ చాలా వాస్తవమైనవని" అన్నాడు కోసలరావు.

"నిజంగా ఆలోకంనించి వొస్తున్నాయంటావా?"

"ఏలోకంనించి వొస్తున్నాయో, ఈలోకంనించే వొస్తున్నాయో! అతనికి నిజంగా వొస్తున్నాయి. అతను నిజమనినమ్ముతున్నాడు."

"సరేలే. కాని పర్యవసానం చూడు."

"వుండు. నువ్వు వెళ్ళు. నేనో తమాషాచేస్తాను. దాంతో ఈ పిచ్చి కుదిరిపోతుంది. నువ్వు వెడుతున్నావుగా. ఒక్క వారంరోజులు

అక్కడే అతని ఇంట్లోనే వుండు. ఏం జరిగినా చూస్తోవూరుకో."

"నువ్వు చెయ్యిచేసుకుంటే అపజయం ఎందుకుంటుంది?"

గోవిందరాజులు వెళ్ళేప్పటికి, శ్యామలరావు ఇల్లంతా దెయ్యాలు తాండవిస్తున్నాయి. ఆ ఇంట్లో బతికినవాళ్ళకన్న చచ్చినవాళ్ళెక్కువగా తిరుగుతున్నారు. ఒక్కగంట నిలవడం కష్టమనిపించింది. కాని తప్పదుగా! గోవిందరాజులు వూరికే స్నేహంగా మాట్లాడి వూరుకున్నాడు. ఏవ్యవహారం ఎత్తలేదు. మొదటిరోజే ముక్కాలు పీటని అడిగారు గోవిందరాజులకి సందేశం ఇమ్మని. "పెన్నలో మునిగి వెంటనే చావమనండి" అని వొచ్చింది ఆజ్ఞ.

మూడోనాడు పొద్దున్న ఒక యురపియన్ ఆమె వొచ్చింది శ్యామలరావుకోసం. ఆమెపేరు మేడేంజూలియా. ఆమె విఖ్యాత "మీడియం". ఆమెద్వారా చచ్చిన యూరపు ప్రాముఖ్యులు, పరలోకాల రహస్యాలు ఎన్నో వెల్లడిచేశారు, ఈ లోకపు స్పిరిట్యుయలిస్టులకి. ఇండియాదేశంలో పరలోక సంబంధాలు ఎక్కువగా ఉన్నాయని విని, వాటిని ఆమె తెలుసుకోడానికి వొచ్చింది ఇండియాకి. ఎవరో మద్రాసులో శ్యామలరావుపేరు చెప్పారు, అందుకని వొచ్చింది నెల్లూరు.

శ్యామలరావు ఉబ్బిపోయినాడు ప్రతి రాత్రీ తన ముక్కాలు పీట మీటింగులకి రమ్మని ఆమెని ఆహ్వానించాడు. తనకి ఇన్టర్నేషనల్ Fame వొచ్చిందని సంతోషించాడు.

రాత్రి శ్యామలరావు ఇంట్లో చాలామంది చేరుతోవుంటారు. కొందరు ముక్కాలు బల్లలో నిజంగా ఇష్టపెట్టు వున్నవాళ్ళూ, కొందరు పొద్దుపోవడానికీ. ఆరాత్రి ముక్కాలుబల్లనించి సందే

శాలు రాసుకుంటోవుండగా మేడేంజూలియా అకస్మాత్తుగా గుప్లు తేలేసింది. మనిషంతా పొణికింది. ఇట్లా ప్రారంభించింది మాటలు:

"నేను, నేను, ఇన్నాళ్ళూ మీ ముక్కాలు బల్లనికదిపే నేను దుర్గని కాదు. నేను సూరమ్మని. మీ అక్కని. దుర్గ నరకంలో వుంది-దుర్గని ఇట్లా స్వేచ్ఛగా రానీరు. ఇన్నాళ్ళూ దుర్గనని నటించి మిమ్మల్ని మోసంచేశాను. ఇవాళ నా మోసాన్ని కనిపెట్టగలిగిన శక్తిగల ఆమె వొచ్చి నన్ను బయట బెట్టింది. అన్నయ్యా. నువ్వు దుర్గను నమ్మావు. చాలాగొప్ప పతివ్రత అని ప్రపంచానికి చాటావు. నువ్వు దుర్గపేరుని నీ ఘనతకి ఉపయోగించుకున్నావు. నువ్వు నీచ మానవుడివి. కాని నీమీది ప్రేమవల్ల నేను దుర్గ రూపంలో నీకు నచ్చేట్టు నాటకం ఆడాను, నిజం చెపితే కృశించి పోతావని. కాని ఇవాళ నాకన్న గొప్ప శక్తితో ఈమె నన్నీడ్చుకొచ్చి నాచేత నిజంమాట్లాడిస్తోంది. దుర్గ వుత్తజారిణి. వొక్కరితోకాదు, తన స్నేహితులతో, నీ స్నేహితులతో. అడగని వారిది పాపం. నీకూ తెలుసు లోపల. కాని నువ్వు కళ్ళు తెరవ తలుచుకోలేదు, నవ్వులపాలవుతావనీ నీకు కీర్తినీ గొప్పతనాన్ని సంపాయించిపెడుతోందనీ. దుర్గ నరకానికి వెళ్ళింది. నిన్న వెళ్ళి చూశాను దుర్గని. నీతో ఈ మాటలు చెప్పమంది. అంత అనుభవించినా తనకి మొగవాళ్ళమీద కోర్కె పోలేదట. తన శరీరం ఇంకా కామతృప్తి కావాలంటోందట. ఆ తృప్తి తీరనంతకాలం, ఆ వాంఛ తీరనంతకాలం తనకి నరకం లోంచి విముక్తి లేదట. ఆతృప్తి నీవల్లనే రావాలి. మరి భర్తవు కదా! మాలోకవాసులకి పుత్రులవల్లా, భర్తలవల్లనే సహాయం జరుగుతుంది. ఇంకెవరూ పనికిరారు. కనక నిన్ను వెంటనే

ఓస్త్రీని సౌఖ్యపెట్టమంది. నువ్వు అనుభవించే స్త్రీని ఆవహించి తాను తృప్తిపడుతుందిట. అదే దుర్గ కడసారికోరిక. ఇంక నాపని అయిపోయింది. నేను వేరే జన్మకి వెళ్ళిపోతున్నాను. ఇంకరాను" అని చెప్పి మేడెం జూలియా వెనక్కి విరుచుకు పడిపోయింది. శ్యామలరావు నోటమాటరాలేదు. సభాసదులు చెల్లాచదరైనారు.

మర్నాడు మేడం జూలియా ఎక్కడా కనిపించలేదు. శ్యామలరావు మూణ్ణెల్లు మంచంపట్టాడు. అంతటితో అతనికి ముస్లా లపీట పిచ్చి వొదిలింది. దుర్గ నామ ప్రచారం మానేశాడు. సలక్షణంగా ప్లీడరీ చేసుకుంటో, బాగా సంపాయిస్తో కాపరం చేస్తున్నాడు—తనని ఆస్పత్రిలో దయగా చూసిన నర్సు నరసమ్మతో.

కోసలరావు గోవిందరాజులకి రెండువందల యాభై రూపాయలకి బిల్లు పంపాడు. బిల్లు చెల్లించుకుంటో గోవింద రాజులు కలకత్తాలో కోసలరావుతో—

"మరి ఏం జరిగినట్టు? సులోచనకి ఏం ఉపకారం జరిగింది?" అన్నాడు.

"సులోచనకి వాడేమిటి? తండ్రికి బుద్ధిలేక పెళ్ళి చేస్తే నాకు బుద్ధిలేదూ? సులోచనసంగతి నేను చూస్తాలే. 'డైవర్సు బిల్లు' ప్రవేశపెట్టించాను, మన కాశీశ్వర్రావుచేత" అన్నాడు.

"మరి ఈ గలభా అంతా ఎందుకు చేయించావు? శ్యామల రావు ఏమైతే మనకేం?"

"సైకలాజికల్ ఇన్‌టరెస్టు"

"నాఖర్చుతో" అని మూలిగాడు గోవిందరాజులు.

---

# మర్యాదస్తుని కో కథ

దక్షిణ ఇండియా తారల్లోకల్లా ప్రసిద్ధతార కుసుమ కుమారి. ఆమెని తెరమీద చూడనికళ్లు, ఆమె పాటని వినని చెవులు, ఆమెని చూచి విని చప్పట్లు కొట్టని చేతులు, ఆమెని స్తుతించని నోళ్లు, ఆమె చిత్రప్రదర్శనాలవేపు నడవని కాళ్ళు మనుషులకి చాలా అనవసరమని పద్యాలు రాశారు నవీన పోతన్నలు. అంతేకాదు ఆమె పత్రికల్ని కొనని ధనం ధనం కాదనీ, ఆమెమీది Scandals చెప్పుకోని క్లబ్బులు క్లబ్బులుకావనీ, ఆమె పద్ధతిని అలంకరించుకోని స్త్రీలు స్త్రీలుకారనీ, ఆమెని హృదయంలో కావిలించని పురుషులు పురుషులుకారనీ, ఆమె నామ సంకీర్తనం జరగని గృహం గృహంకాదనీ. ఆమెకి సన్మానం చెయ్యని పట్టణం పట్టణం కాదనీ కూడా సీసపద్యాలు రాశి చివరికి ఆమెపైన పద్యాలు రాయని కవి కవి కాదన్నారు. ఆ అపనింద కథకులపైకి కూడా వొచ్చేట్టు కనపడి భయంతో ముందే ఈ కథ రాసేస్తున్నాను అన్నాడు ఆంధ్ర కథకుడుగా ఆచంద్రార్కం అద్భుతమహిమతో ఆరాధింపబడాలని ఆశించే ఈ కథక రాజన్య చూడామణి.

కుసుమబాల గత పదిసంవత్సరాలనుంచి ఆంధ్ర, తమిళ, కర్నాటక, మళయాళ, కన్నడ, హిందీ, స్కాంఘిక, జానపద, చరిత్రాత్మక, భక్తి, సంస్కారిక, సంసారిక చిత్రాలలో ప్రధాన నాయకిమై నటించింది. అన్ని భాషలలోనూ, ప్లేబాక్ లేకుండా కర్నాటక, హిందీ బాణిలలో, శాస్త్ర, సినీమా, నవీన, భరత

మాత, భర్త మాత, తెలుగుమాత, తమిళమాత, తన సొంత మాతల కీర్తనల్ని పాడింది

ఆమె వివాహానికి సమస్త సినీమా కళాప్రపంచం హాజరయింది. ఆ పెళ్ళి చాలా ఆలస్యంగా, అనవసరంగా జరిగింది. వరుడు ఎవరో చాలాకాలంనించి అందరికీ తెలుసు. ఆమె చిత్రాల డైరెక్టరు సంజీవరాయుడు. ఆతను ఆమె చిత్రాల డైరెక్టరు కావడానికి ఆతని అర్హత, పగేళ్ళనించి ఆమె శయ్యాభాగస్తుడు కావడం. యోగ్యత ఆమె సినిమాకంపెనీ షేర్ల భాగస్తుడు కావడం! ఆమెకి వొచ్చిన పెళ్ళిబహుమానాలతో మద్రాసునగరం లోని బట్టలషాపులూ, నగలషాపులూ పాతసరుకు తీసేసి ఆ బహుమానాలతో నింపవొచ్చు.

గొప్పడిన్నరు ముగిసేప్పటికి ఇంకా రాత్రి తొమ్మిది గంటలే. సినీమాల ఆర్కెస్ట్రాలూ, పాటకులూ, హాస్యనటకులు, చేరిన తరువాత ఏమేం ప్రోగ్రాములు వుంటాయో తెల్లాల్లా అనుకున్నారు. అతిథుల్ని ఒక పెద్ద హాలులో ఆసీనుల్ని చేసి సంజీవయ్య వాళ్ళని ఎడ్రెసు చేశాడు.

"ఈ శుభసమయంలో మిమ్మల్ని వినోదపరచడానికి నాకు ప్రత్యేకమైన పద్ధతి తోచింది. పాటకచేరీలు మొదలైనవి చాలా మామూలు. మనం రోజూ అవస్తపడే పాటల్ని వాళ్ళు ఇక్కడ వినిపించడం పాతకం. ఈరాత్రి మీకు ఓ కథ చెపుతాను. అది ఈనాటి వధూవరుల ప్రణయగాథ—లేక అప్రణయబాధ—లేక జీవిత శోధ, కాకపోతే ప్రణయ మరణ బోధ" అని ఆగాడు.

సంజీవరాయుడు చాలా ప్రేమాస్పదుడు. గర్వమూ ఈర్ష్య లేని మనిషి. ధర్మపరుడు. కష్టంలోవున్న సోదరుడికి వెంటనే

